TPW A110 B130

# తరణి

రవీంద్రనాథ ఠాగూరు

జయంతి పబ్లికేషన్సు
గోపాలరెడ్డి రోడ్ :: విజయవాడ-2.

2

ముద్రణ :
నవంబరు ' 64
రు. 1_00

ప్రింటింగు :
"బాలాజీ"
విజయవాడ_2

అనువాదం :

ఖండవిల్లి సాంబశివరావు

సంపాదకులు :

యం. పెరుమాళ్ళు

# 1

నేను ప్రయాణం అవుతూన్న ఈ రోజున మబ్బుల్ని చీల్చుకొని సహస్రకిరణాలతో సూర్యభగవానుడు వెలుగుతున్నాడు.

విస్ఫారితనయనాలతో అంబరం ధరిత్రిని విస్మయంతో తిలకిస్తోంది.

తనకు వచ్చిన పిలుపు ఎచ్చటినుంచో తెలియక నా హృదయం బాధపడుతోంది.

ఈ మలయమారుతం – నేను వదలివచ్చిన లోకం యొక్క – నిశ్శబ్దంగా అశ్రుగానం చేస్తూన్న ఆలోకం యొక్క రహస్య సందేశాన్ని, తీసుకువచ్చిందా?

లేక అజ్ఞాత కుసుమాల వసంతలో చలికాగుతూనన సుదూర సముద్ర మధ్యస్థ దారి యొక్క పరిమళ శ్వాసను తీసుకు వచ్చిందా?

# 2

సంత అయిపోగానే, ఆ సాంధ్యసమయంలో ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోతున్నారు.

నేనుమాత్రం – సూర్యాస్తమయ చిరునగవు తెర చాపపై వెలుగుతూండగా, కాటుక జలాల్లో పడవను ఆవలి

ఒడ్డుకు నడిపించుకు వెళ్ళుతూన్న నిన్ను చూదామని, దారి ప్రక్కనే కూచుండిపోయా.

చుక్కాని వద్దనుంచున్న నీ మౌన విగ్రహాన్ని నేను చూసేను. నావైపు దృష్టి సారిస్తూన్న నీ కనుదోయిని అకస్మాత్తుగా పరికించేను.

పాడుతూన్న నేను, పాట వదలి, నన్నుకూడా ఆవలి తీరానికి తీసుకువెళ్ళమని మొరపెట్టేను.

## 3

ఎదురు గాలి వీచటం ప్రారంభమయింది. నా పాటల ప్రయాణం కూడా ప్రారంభమయింది. ఓనావికా, చుక్కాని వద్ద కూచో.

నా పడవ స్వాతంత్ర్యంకోసం, వాయు, జలతరంగాల లయాను గుణ్యంగా నాట్యం చేయటం కోసం పరితపిస్తోంది.

పగలంతా గడిపేసాను. సాయంత్రం అయింది. నా స్నేహితులు వెళ్ళి పోయారు. పడవ తాలూకు గొలుసు సడలించి, లంగరు ఎత్తివేయి. నక్షత్ర కాంతిలోమనం ప్రయాణం కొనసాగిద్దాం.

నేను బయలుదేరుతూన్న ఈ సమయాన మందమారు

తం మధుర మంజులగానంచేస్తోంది. ఓ నావికా, చుక్కాని వద్ద కూర్చో.

# 4

ఓ నా ప్రభూ, నన్ను స్వీకరించు. ఈ క్షణకాలం నన్ను స్వీకరించు.

నిన్నువినా గడపిన ఆ దిక్కుమాలిన దుర్దినాలను విస్మరింపనీ.

ఈ అల్పక్షణాన్ని, నీ దివ్య తేజఃపుంజంక్రింద అడ్డాలలో వేసుకొని, విస్తరింపచేయి.

నన్ను ఆకర్షిస్తూన్న కంఠస్వరాలను అన్వేషిస్తూ తిరిగేను. అవి నన్ను ఆకర్షించటం తప్ప ఎచ్చటికీ తీసుకువెళ్ళలేకపోయేయి.

ఇప్పుడు నన్ను ప్రశాంతంగా కూచుని నా నిశ్శబ్దపు టంతరాత్మలో నీ మాటలను విననీ.

నా హృదయ తమోరహస్యాలకునీ ముఖారవిందాన్ని దూరం చేయకు. కాని నీజ్ఞాన జ్వాలతోవాటిని దహించి ప్రభా సమన్వితం చేయి.

## 5

రాబోయే తుఫాను యొక్క భటులు ఆకాశంలో మబ్బుల గుడారాలను వేశారు.కాంతి పాలిపోయింది.అరణ్యాల మూగ నీడలలోని గాలి కన్నీటితో చెమ్మగిల్లింది.

గానం ప్రారంభించే ముందు ప్రభువు వేణువుపై మోహరించిన నిశ్శబ్దంలా, నా హృదయంలో ఖేదం గూడు కట్టుకుని ఉంది.

నా జీవితలో అడుగిడతావనే మహదాశతో, నా జగత్తంతా నీ కోసం ఇంకా ఎదురు చూస్తూనే ఉంది.

## 6

ఓ నా ప్రియుడా, మంచి పని చేశావు!నీ విరహాగ్నిని నా వద్దకు పంపి మంచిపని చేశావు!

నా కప్పూరం వెలగనిదే తన పరిమళాన్ని ఎన్నటికీ వెదజల్లదు. నా దీపం వెలిగించేటంత వరకు గ్రుడ్డిగానే ఉంటుంది.

నా మనస్సు మొద్దుబారినప్పుడు, దాని జడత్వాన్ని నా అనురాగపు మెరుపులతో తాడించి, చైతన్యవంతం

చేయాలి. ఏగాఢ తమస్సు నా జగత్తును కళంకితం చేసిందో ఆ తమస్సే నీ గర్జనలచేత అగ్ని సంస్కారం కావింపబడి నప్పుడు దివిటీలా వెలుగుతుంది.

# 7

స్వకీయ అనుమానాల నీడలనుంచి భంగపాటుల నుంచి, అలజడులనుంచి,ఓ ప్రభూ నన్ను విముక్తుణ్ణి చేయి.

ఈ రాత్రి అంధకార బంధురంగా ఉంది, నీ యాత్రి కుణ్ణి గ్రుడ్డివాణ్ణి చేసింది. అందుచేత, నీవు చేయూత ఇచ్చి నడిపించుకు వెళ్ళు.

నిస్పృహనుండి నన్ను విముక్తుణ్ణిచేయి.

శాంతి రహితమైన నా శోకదీపానికి నీ జ్ఞానజ్వాల తాకించు.

అలసి సొలసిన నా సుప్తశక్తిని జాగృతంకావించు. నష్టాన్ని లెక్ఖించుకుంటూ నన్ను వెనుక పడనీయకు.

నీ మందిరాన్ని గురించి, అడుగడుక్కీ ఈ శాటన కీర్తించనీ;

ఈ రాత్రి అంధకార మయంగాఉంది, నీ యాత్రి కుణ్ణి అంధుణ్ణి చేసింద. అందుచే, నీవు చేయూతఇచ్చి, నడి పించుకు వెళ్ళు.

## 8

ఆ దూరపు పాట నావరించిన చిమ్మ చీకటికి నా చేతి దీపము శత్రువయింది.

ఈ బాట ప్రక్కలు నాకు భీతి గొల్పుతున్నాయి, ఇచ్చట కుసుమిస్తూన్న తరువుకూడా క్రూరదృష్టిగల బ్రహ్మ రాక్షసిలా భయపెడుతోంది నన్ను. నా పదముల ధ్వనే ప్రతి ధ్వని రూపంలో తిరిగి నా వద్దకు వస్తోంది.

అందుచేతనే నీ ఉదయకాంతికోసం నేను ప్రార్థిస్తున్నా ఆ ఉదయాన అనంత దూరం, అతి సమీపం పరస్పరం ఒక దానొ్నకటి ముద్దుపెట్టుకుంటాయి. ఆ సమయాన జీవన్మర ణాలు ప్రేమలో ఒకటిగా అయిపోతాయి.

## 9

నీవు నన్ను రక్షించినప్పుడు, నా అడుగులు తేలిక పడతాయి.

నా హృదయగీత కళంకాలను క్షాళనం చేసినప్పుడు, అది నీ సూర్యకాంతిని కుసుమ సుందర పుష్పంగా వికసించ కుండా మొగ్గగానే ఉండిపోయినందున, ఆభావన సృష్టి అంత రంగాన్ని చింతా క్రాంతం చేస్తోంది.

నా హృదయాచ్ఛాదిత అంధకార వాసస్సు తీసివేయగానే, నీ మందహాసానికి మధుర సంగీతాన్ని సమకూరుస్తుంది.

## 10

ఈలోకాన్ని నీ కానుకలతో నింపివేస్తూ, నీ అనురాగాన్ని నాకు ప్రసాదించేవు.

వాటిగురించి తెలియని స్థితిలో ఉన్నప్పుడు, వాటన్నిటినీ నాపై వర్షించేవు. ఆ సమయంలో నా హృదయం నిద్రాభమైవుంది. ఆరాత్రి అతి గాఢాంధకారంగా వుంది.

స్వప్నాల దారులలో తప్పిపోయినా, నన్ను ఆనంద పులకితుణ్ణి చేశావు.

నాకు నీవు ప్రసాదించిన బ్రహ్మాండమైన నిధులకు బదులుగా నేను నీకు ఇవ్వగలిగేది ఒకచిన్ని ప్రేమప్రసూనం మాత్రమే.

## 11

నీకోసం కాచుకు కూర్చోడంతో నా నేత్రాలు నిదురకు దూరమయ్యాయి. నిన్ను కలుసుకోలేక పోయినప్పటికి, నీకై కాచుకొని ఉండటం మధురం.

వర్షమేఘాల నీడలలో కూచుని నా హృదయం నీ ప్రేమామృతంకోసం నిరీక్షిస్తోంది. నీ ప్రేమని పొందలేక పోయినప్పటికీ, దాన్ని గురించి ఆశిస్తూ వుండటం మధురం.

అందరూ నన్ను వదలి, విభిన్న పథాలలో వెళ్ళి పోయారు. నేను ఒంటరినయినప్పటికీ, నీ అడుగుల సవ్వడి కోసం చెవులు అప్పగించి ఉండటం అతి మధురం.

శిశిర హిమ తెరలు నేస్తూన్న ధరిత్రీ వదనం, నా హృదయంలో ఒక కోర్కెను రేకెత్తిస్తోంది. ఆ కోర్కె సఫలం కాకపోయినప్పటికీ, వాంఛించడం అనే బాధను అనుభవించడం మధురాతిమధురం.

## 12

ఓ హృదయమా, నీ విశ్వాసాన్ని ధృడంగా ఉంచుకో! ఆ సుదినం తప్పక వస్తుంది.

వాగ్దాన విత్తనం నేలలో లోతుగా నాటబడింది. అది మొలకెత్తుతుంది.

నిదుర, మొగ్గమాదిరి, వెలుగుకే తన హృదయాన్ని విప్పుతుంది. మౌనం తన గొంతును తనే కనుగొంటుంది.

నీ బరువే నీకానుకగా మా రేరోజు సమీపించింది. నీ బాధలే నీదారికి వెలుగు చూపిస్తాయి.

11

# 13

సంజవేళ వివాహము జరుపుటకు సుముహూర్తము పెట్టబడింది. ఆసమయాన విహంగాలు చరమగీతాల్ని గానం చేశాయి. జలాలమీద పవనాలు విశ్రమించాయి. వివాహ మందిరంలో సూర్యాస్తమయం తివాసీ పరచింది. రాత్రంతా వెలగటానికి దీపం సిద్ధం చేయబడింది.

ఆ నిశ్శబ్ద అంధకారం వెనుకనుంచి అగోచరుడైన వ్యక్తి నడుచుకు వస్తున్నాడు.

నా హృదయం కంపిస్తూంది.

పాడుతున్న పాటలన్నీ ఆపివేయబడ్డాయి.

శుక్రనక్షత్రం కింద అర్చన ఆరంభమవుతుంది.

# 14

పగటి కోలాహలం నిశీధంలో అణగారగానే సాగర మర్మరధ్వని గాలిలో నిండిపోయింది.

దేశ ద్రిమ్మరులైన పగటి కోర్కెలు, రాత్రిఅవగానే విశ్రమించటానికి, వెలుగుతూన్న దీపం చూట్టూ చేరాయి.

ప్రేమయొక్క క్రీడ, ఆరాధనగా మారి నిశ్చల మయింది. జీవిత ప్రవాహం అగాధతలాలను స్పృశించింది. రూప ప్రపంచం, రూపాతీత ఆత్మీయ సుందర మందిరానికి చేరుకుంది.

# 15

నిద్రిస్తూన్న ఈ ధరిత్రిలోను-నిశ్చలమైన పత్రదళాల మధ్య నిద్రతో తూగుతూన్న మందమారుతంలోను ఒంటరిగా మేల్కొని ఉండేదెవరు?

నిశ్శబ్దంగా ఉన్న పక్షిగూళ్ళలోను, పూమొగ్గల అంతరంగాల్లోనూ మేల్కొని ఉండేది ఎవరు? నిశీధంలోని మిణుకుమిణుకు తారకలలోను, నా అస్తిత్వపు బాధల లోతుల్లోను, మేల్కొని ఉండేది ఎవరు?

# 16

ప్రభాతవేళ నీవు నా కవాటం దగ్గరకు వచ్చి గానం చేసావు. నిద్రనుంచి మేల్కొలిపి నందువల్ల నీపై నాకు కోపం వచ్చింది. నీవు నిర్లక్ష్యంగా వెళ్ళిపోయావు.

నీవు మిట్టమధ్యాహ్నంవచ్చి మంచినీరు ఇమ్మన్నావు. పనిలో ఉన్న నాకు, ఆ అడగటం విసుగు పుట్టించింది. చీవాట్లుపెట్టి నిన్నుపంపేశాను.

నీవు సాయంకాలమున జ్వలిస్తూన్న దివ్వెలతో తిరిగి వచ్చేవు.

నీవు మహా భయంకరంగా ఆ సమయంలో అగుపించేవు. నేను తలుపులు మూసివేశాను. పరాభవించి పంపివేసిన నిన్ను ఇప్పుడు—ఈ నడిరేయి—అంధకార బంధురమయి దివ్వెలేని ఈ నా గదిలో ఒంటరిగా కూచుని, తిరిగి దయ చేయమని పిలుస్తున్నా.

# 17

మట్టిలో పడివున్న ఈ నా జీవితాన్ని బయటకు తీసి నీ కుడి అరచేతిలో పెట్టుకొని నీ దయాదృష్టి వర్షిస్తూండు.

నా జీవితాన్ని వెలుగులో పైకి ఎత్తి ఉంచు. మృత్యువు నీడలో దాన్ని దాచివేయి. నిశాపేటికలో నీ చుక్కలతో దానిని భద్రపరచుము. తరువాత తెల్లవారగానే ఆరాధనలో వికసించిన పూలమధ్య తను ఉన్నట్లు తెలుసుకొననీ—

# 18

ప్రేమలో పరిణతి పొందలేని ఈ జీవితం పూర్తిగా నష్టపోలేదని నాకు తెలుసు.

ప్రభాత సమయాన వాడిపోయే ప్రసూనాలు, ఎడారులలో దారితప్పి ఇంకిపోయిన వాహినులు పూర్తిగా నష్టపోలేదని నాకు తెలుసు.

మందకొడితో నింపబడిన ఈ జీవితంలో ఏది వెనుక బడ్డా సరే, అది పూర్తిగా నష్టపోలేదని నాకు తెలుసు.

ఇంకను సఫలం కాని నా స్వప్నాలు - ఇంకను ఆలాపించని నా మధుర తంత్రులను అంటిపెట్టుకొని ఉన్నప్పటికీ, అవేవీ పూర్తిగా నష్టమయి పోలేదని నాకు తెలుసు.

# 19

నవ వసంతంలో మధురవేణుగానం చేస్తూ పరిమళ ప్రసూన మంజరులతో నీవు నా వద్దకు వచ్చేవు.

నా అనురాగ అరుణ కమలాన్ని ఊపి ఊపి, నా హృదయ కాసారంలోని చిరు అలలను అనంత తరంగాలుగా ఉప్పొంగించి, నా అంతరంగాన్ని క్షోభింప చేసావు.

జీవిత రహస్యం తెలుసుకునేందుకు బయటకువచ్చేయమని నన్ను కోరేవు. కాని గల గలారావం చేస్తూన్న మధుమాసపు పర్ణాల మధ్య నేను నిద్రలో మునిగిపోయాను.

నేను నిద్ర లేచేసరికి ఆకాశం మేఘావృతమయింది. ఎండి రాలిన ఆకులు గాలిలో రివ్వున ఎగిరిపోతున్నాయి.

వర్షపు చప్పుళ్ళలో, సమీపిస్తూన్న నీ పద ధ్వని, మృత్యు రహస్యంలోకి నీతో నన్ను నచ్చేయమంటూన్న పిలుపు నేను విన్నాను. నేను నీకేసి నడచుకుంటూ వచ్చాను.

జ్వలిస్తూన్న నీ నేత్రాల్ని, నీరు కారుతూన్న నీ కేశ పాశాన్ని తిలకిస్తూ, నా చేతిని నీ చేతుల్లో ఉంచేను.

## 20

వర్షంతో ఈ రోజంతా కాంతిహీనంగా ఉంది.

చిరిగిన మబ్బు తెరలలోంచి ఆగ్రహంతో ఉన్న మెరపులు తళుక్కుమంటూ తొంగి చూస్తున్నాయి.

బోనులో బంధింపబడిన మృగరాజులా నిరాశా నిస్పృహాలతో గోచరిస్తోంది ఆ అరణ్యం. అటువంటి దినాన–రెక్కలల్లార్చుకుంటూ పరుగులు తీస్తూన్న ఝంఝా మారుతాల మధ్య – నీ సన్నిధిని నేను మనశ్శాంతి పొందనీ.

నా హృదయాన్ని తాకే నీ స్పర్శ గాఢతరం చేయుటకు గాను, దుఃఖిస్తూన్న ఆకసం, నా ఏకాంత వాసంపై నీలి నీడలు క్రమ్మింది.

## 21

నా గృహ కవాటాన్ని పగులగొట్టి తెరచిన ఆ గాలి వాన నాటి రేయి, కూలిన భవనాలు, పడిన చెట్ల గుండా నీవు నా గదిలో ప్రవేశించిన సంగతి నాకు తెలియదు. కారణం– అప్పుడు నా గదిలోని దీపం ఆర్పివేయబడింది.

గదంతా చీకటిమయం అయిపోయింది. సహాయం అర్థిస్తూ ఆకాశంకేసి నా రెండు చేతులూ చాపేను.

ఆ భయంకర గాఢాంధకారంలో, ఆ మట్టిలో పండుకొని నిరీక్షించ సాగేను. ఆ గాలివాన నీ కేతనం అని తెలుసుకోలేకపోయాను.

తెల్లవారిన తరువాత, నా గృహ సీమను ఆవరించిన శూన్యతపై నుంచుని ఉన్న నిన్ను నేను చూసేను.

## 22

లయ కారకుడు వచ్చేడు ? ఏమంటే — మహోద్రిక్తమైన కన్నీటి కడలి పొంగి పొరలుతూన్న వ్యథతో నిట్టూరుస్తోంది.

కుసుంభారుణ మేఘాలు మెరుపు కోలల చేత తాడింపబడి, గాలిలో వెర్రిగా పరుగెడుతున్నాయి. ఉన్మత్తుని ఉరుముల వికటాట్టహాసం ఆకాశంలో వినబడుతోంది.

మృత్యుకిరీటం ధరించిన జీవితం, రథంలో కూర్చుంది.

నీకు ఉన్నదంతా అతనికి సమర్పించటానికి తీసుకురా.

ఏవీ నీ హృదయంలో దాచిపెట్టుకోవద్దు. వెను తిరిగి చూడకు.

శిరోజాలను ధూళిలో పరచి నీ శిరస్సు అతని పాద పద్మముల మీద ఉంచు.

ఈ క్షణంనుంచి ఆ దారినే అనుసరింపుము. ఇంటి లోని దీపం ఆరిపోయింది. గృహం శూన్యం అయింది.

తలుపు సందులగుండా తుఫాను గాలులు ఈలలు వేస్తున్నాయి. ఇంటి గోడలు ఊగిసలాడుతున్నాయి. చూపు కందని దూర తీరాలనుంచి పిలుపు వినవస్తోంది.

భయంతో నీ ముఖాన్ని దాచుకోకు. కన్నీరు నిర ర్థకం. నీ తలుపుల గొళ్ళేలు ఊడిపోయాయి.

సమస్త సుఖదుఃఖాల నివృత్తికోసం ప్రయాణానికి పరుగులెత్తు.

నీవు వేసే అడుగులు సాహసాత్మకమైన నృత్యపు టడుగులు కావాలి.

"మృత్యుముఖంలోని జీవితానికి జై" అంటూ పాట పాడు.

ఓ పెళ్ళికూతురా! కర్మానుసారం నడుచుకో—పెండ్లి కుమారుని కరదీపికా! అంధకారంలో ఆతనిని అనుసరించ టానికి నీ రక్తాంబరాలను ధరించిరా !

# 23

నిన్ను గాయపరచటానికి నీకు అతి సమీపానికి వచ్చేశాను. అలా వచ్చినట్లు నాకు తెలియనే లేదు.

నీతో పోట్లాడి ఓడిపోయి,ఎట్టకేలకు నిన్ను నా యజమానిగా పొందగలిగేను.

నేను నిన్ను రహస్యంగా దోచుకుని, నీకు నా ఋణభారాన్ని అధికతమం చేశాను.

నీ ప్రవాహ వేగానికి అహంకారంతో ఎదురీది సతమత మయ్యేనంటే; నీ అనంత శక్తినంతా నా గుండెల్లో అనుభూతి పొందటానికే.

నా ఇంటిలో వెలుగుతూన్న దీపాన్ని ఉద్వేగంతో ఆర్పివేసాను. నీ వినీలాకాశం నక్షత్రాలను రప్పించి నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేసింది.

# 24

నీవు నా దగ్గరకు నా దుఃఖంగా వచ్చేవా? అయితే నిన్ను నేను మరింత యెక్కువగా అంటిపెట్టుకొని ఉండాలి.

నీ ముఖం అంధకారంలో ముసుగు మాటున దాగి ఉంది. అయితే నిన్ను నేను విధిగా చూడాలి.

నీ చేతి చావుదెబ్బతో, నా ప్రాణం జ్వాలగా పై పైకి ఎగురుకుంటూ పోనీ.

నా కళ్ళవెంబడి అశ్రువులు అనంతంగా ప్రవహిస్తు న్నాయి. వాటిని నీ పాదపద్మములచుట్టూ ప్రవహిస్తూ అర్పిం చనీ.

నా గుండెల్లో నిండుకొని ఉన్న వేదన, ఇప్పటికీ నీవు నావాడవే అని నాకు చెప్పనీ.

# 25

నిన్ను తప్పించుకునేందుకు దాగి ఉన్నాను. చివరకు నేను పట్టుబడిపోయాను. కాబట్టి ఇప్పుడు నన్ను శిక్షించు— నేను జంకుతానేమో చూడు.

నీ పుణ్యముంటుంది, ఈ ఆట ఇంతటితో పూర్తి చేయి.

చివరికీ నీవు గెలిచావంటే, నా సర్వస్వాన్ని నీవే తీసుకో.

పాకల్లోనూ, రాచ దర్బారుల్లోనూ ఆడుకుంటూ, పాడుకుంటూ, కేరింతల కొడుతూ తిరిగేశాను—యిప్పుడు నా జీవితంలో నీవు అడుగుపెట్టేవు కాబట్టి నను ఏడ్పించు- నా హృదయం పగులగొట్టగలవేమో చూడు

## 26

నీ ప్రేమతో నేను మేల్కొనేసరికి, నా సుఖసౌఖ్యాల రాత్రి సమాప్తం అయిపోతుంది.

నీ సూర్యోదయం తన జ్వాలా గీటురాయితో నా హృదయాన్ని స్పృశిస్తుంది. అప్పటినుంచి, నా ప్రయాణం బాధల కక్ష్యలో తిరుగాడటానికి ప్రారంభ మవుతుంది.

మృత్యువు సవాలును యెదిరించి, వెక్కిరింతలు, వేళాకోళాలు, బెదిరింపులనైనా నిర్లక్ష్యం చేసి నీ వాణిని తీసుకొని వెళ్ళగలను.

నీ బిడ్డలమీద జరిగే దురాగతాలకు, దౌర్జన్యాలకు నా గుండెను అడ్డుపెట్టి, నీవుతప్ప వే రెవ్వరు ఉండని నీ ప్రక్కనే, నేను నుంచుని ఏ ప్రమాదాన్నయినా స్వీకరిస్తా.

## 27

నిర్జీవమై, బీటలు వారిన గ్రీష్మర్తులోని పరిశ్రాంత పృథ్విని నేను.

నిశీథిలో వర్షించే నీ అమృత వర్షంకోసం నేను నిరీక్షించి ఉన్నా. అది రాగానే నా గుండె విప్పి, నిశ్శబ్దంగా దాన్ని గ్రహిస్తా.

దానికి బదులుగా నా మధుర గీతాలను, పరిమళ ప్రసూనాలను నీకు సమర్పించ ఇచ్ఛగిస్తున్నాను.

గాని నా ఖజానా అంతా ఖాళీ అయిపోయింది. నా గుండెల్లోంచి గాఢమయిన నిట్టూర్పు ఒక్కటి మాత్రం ఎండిపోయిన గడ్డిపోచలగుండా పైకి వచ్చింది—

కాని నీవు ఉదయం అయ్యేవరకు వేచి ఉంటావని నాకు తెలుసు. అలా ఉన్నట్లయిన, నా తాలూకు ఆ ప్రభాత ఘడియలు సమస్త సంపదలతో పరిపూర్ణంగా విలసిల్లుతూ ఉంటాయి.

# 28

వేసవి మేఘంవలె ఆకాశం ఒక చివరినుంచి వేరొక చివరివరకు వర్షపు జల్లులను విరజిమ్ముతూ నీవు నా దగ్గరకు రా.

నీ రాజసపు నీడలతో భూధరాల కృష్ణలోహిత వర్ణాన్ని గాఢతమంచేయి.

శోభా దరిద్రాణమైన కాంతారాలను త్వరగా కుసుమింపచేయి.

కొండవాగుల హృదయాల్లో దూరప్రదేశాల అన్వేషణేచ్ఛను జాగృతం చేయి.

దాచి ఉంచిన కల కల లాడే కమ్మని జీవితాన్ని, నిరంతరానందాన్ని నాకు వాగ్దానం చేస్తూ, వేసవి మేఘంలా నా దగ్గరకు వేంచేయి.

22

## 29

పగటి పొలిమేరని రాత్రి యెచ్చటయితే స్పృశి స్తుందో అచ్చట నిన్ను నేను కలుసుకున్నాను.

వెలుగు చీకటిని భయపెట్టి ప్రభాతంగా యెచ్చట మాడుస్తుందో అచ్చట నిన్ను నేను కలుసుకున్నాను.

ఒక తీరంయొక్క ముద్దును వేరొక తీరానికి ఎచ్చ టయితే తరంగాలు చేరుస్తాయో అచ్చట నిన్ను కలుసు కున్నాను.

అగాధమైన నీలి కడలి హృదయంనుండి,అతి మధుర మైన పిలుపు ఒకటి వినవస్తోంది.

నా కన్నీటి సాంధ్య చీకటిగుండా నీ వదనాన్ని దర్శించటానికి ప్రయత్నిస్తా. కాని నీ దర్శనలాభం కలిగిందో లేదో నిశ్చయంగా చెప్పలేను.

## 30

నేనంటే ప్రేమ లేకపోయినప్పుడు—

పాటలు పాడుతూ యెందుకు తన హృదయాన్ని పగులగొట్టుకుంటూంది ఈ ఉషాసుందరి?

నవపల్లవాలతో దక్షిణపవనం ఎందుకీ గుస గుసలు ఆడుతోంది?

నేనంటే ప్రేమ కాకపోయినప్పుడు—

ఎందుకీ అర్ధరాత్రి తారకాగణాల వ్యథను కరుణార్ద్రమైన మౌనంతో భరిస్తోంది?

ఎందుకీ మూఢ హృదయం అంతులేని సాగరంలో తన ఆశానౌకను నిర్లక్ష్యంగా, నిర్భీతితో ప్రయాణానికి వదలింది!

# 31

నా కోరుకలో కొంతభాగం మాత్రమే ఈ లోకంలో ఉంది. మిగిలినదంతా నా స్వాప్నిక జగత్తులో ఉంది.

నా స్పర్శను నిరంతరం అతి కౌశలంతో తప్పించుకునే నీవు, నీ దీపమును దాచి రహస్యంగా నిశ్శబ్దంగా అక్కడకు వచ్చేవు.

ఆ అంధకారంలో నిన్ను పులకాంకురాల వలన— అగోచర లోకాల గుస గుసల వలన, అజ్ఞాత తీర శ్వాస వలన నిన్ను నేను తెలుసుకుంటాను.

దుఃఖ భాష్పాలుగా కరిగిపోతూన్న నా హృదయంలో హఠాత్తుగా కలిగిన నిర్మలానందం వలన నిన్ను నేను తెలుసుకుంటాను.

# 32

ఓ నా ప్రియుడా! ఏనాడో ఒకనాడు నా హృదయాన్ని జయిస్తావని నాకు తెలుసు.

నీ నక్షత్రాలలోంచి నా స్వప్నాల అగాధాల్లోకి చూసేవు.

నీ రహస్య సందేశాల్ని చంద్రకిరణాల ద్వారా నాకు పంపేవు. వాటిని గురించే నేను ఆలోచిస్తూ ఉంటాను. అప్పుడు నా కళ్ళు కన్నీటితో నిండి మసకబారి పోతాయి.

గొల్లల కాపరి వేణుగానంతో పొంగి పొరలుతూ ఉండే సోమరి ఘడియలలోనూ, రెప రెప లాడే పల్లవాల్లో హర్ష పులకలు పొందే నిర్మలాభ్రంలోనూ, ఒంటరితనంవల్ల హృదయం విరహబాధపడే ఆ వర్ష సాంధ్య సమయంలోనూ, నీవు నీ ప్రణయాన్ని సాగిస్తున్నావు.

# 33

ఎవరో ప్రేమ ప్రసూనాన్ని ఒకటి రహస్యంగా నా చేతిలో పెట్టేరు.

ఎవరో నా హృదయాన్ని దొంగిలించి నీలాల నింగిలో దూరాన విరజిమ్మేరు.

అతనిని కనుగొన్నానో లేదో, అతన్నిగురించి అన్వేషణ అంతటా ఇంకా జరుపుతున్నానో నాకు తెలియదు.

ఆ వేదన మధురమయిందో, దుఃఖమయమో నాకు తెలియదు—

# 34

వానలు ఆకాశంలోని కశ్మలాన్ని ఈ చివరనుంచి ఆ చివర వరకు ఊడ్చివేసాయి.

శీతలమైన అడవి గాలులలో ఊగుతూ మల్లెపూలు తమ మనోహర పరిమళంలో ఆనంద పరవశత్వం పొందుతున్నాయి.

నిశావధూటి హృదయాంతరంలో అనిర్వచనీయమైన ఆనందం గూఢంగా ఉంది—దాక్కొని ఉన్న తారకలను—చూచుకొని అవగుంఠనంలో ఉన్న ఆకాశం పొందుతూన్న ఆనందమే నిశాకాంత హృదయంలోని ఆనందం—

నిర్వచేసి దాచుకొన్న పక్షుల పాటలు తలచుకొని నడిరేయి అడవి అనుభవిస్తూన్న ఆనందమే నిశాకాంత హృదయంలోని ఆనందం—

నా హృదయాన్ని ఆ ఆనందంతోనే నింపుకొని పగటి పూట రహస్యంగా తీసుకు వెళ్ళనీ.

## 35

పగలు ప్రయాణం చేసినప్పుడు ఎంతో భద్రత గోచరించింది. నీ కాలిబాట విచిత్రాన్ని గుర్తించకుండా, గర్విష్ఠినై శీఘ్రగతితో పోయేను. నీ తేజస్సు మన ఇరువురి మధ్య అడ్డుగా నిల్చుంది–

ఇప్పుడు రాత్రి అయింది– ఈ గాఢాంధకారంలో అడుగడుగునకూ నీ బాటను గుర్తిస్తున్నాను. వెలుగు పోయి చీకటి అయినప్పుడు బిడ్డను బుజ్జగిస్తూన్న మాతృదేవత గుసగుసల మాదిరి, ఈ నిశ్శబ్దాన్ని నింపిన పుష్పపరిమళాన్ని నేను ఆఘ్రాణిస్తున్నాను.

నీ హస్తాన్ని ధృఢంగా పట్టుకొని ఉన్నాను. నేను ఒంటరి నయినప్పుడు నీ మధురస్పర్శ నాతోనే ఉంటుంది.

## 36

రేయల్లా పయనించి జీవితం ఇస్తూన్న విందుకు వచ్చాను. ఉషాసుందరి స్వర్ణపాన పాత్ర కాంతితో నింపబడింది నా కోసం.

అపరిమితానందంతో నేను పాడేను.

ఆ దాత ఎవరో నాకు తెలియలేదు.

అతని పేరు అడగటం కూడా మరచిపోయేను.

మిట్టమధ్యాహ్నం పాదాలక్రింద ధూళి, నెత్తిమీద సూర్యుడు మండుతున్నాయి.

పిపాసార్తుడనై, బావి దగ్గరకు వచ్చేను.

మధురజలం నాకు ఎవరో పోసేరు.

దానిని నేను త్రాగేను.

ముద్దులా మధురంగా ఉండే ఆ కెంపుల పానపాత్రను నేను ప్రేమించేను. కాని దానిని పట్టుకున్న వ్యక్తిని మాత్రం నేను చూడలేదు. అతని పేరు అడగటంకూడా మరచిపోయే_

అలసిపోయిన నేను సాయం సమయమున గృహోన్ముఖుడనై దారికోసం చూస్తున్నా.

ఆ సమయాన నా మార్గదర్శి దీపంతో వచ్చి, నన్ను పిలచేడు.

అతని పేరు అడిగేను.

నిశ్శబ్దం గుండా అతని దీపాన్ని మాత్రమే నేను చూడ కలిగేను. అంధకారాన్ని నింపిన ఆతని మధుర మందహాసాన్ని అనుభూతి పొందకలిగేను.

## 37

నన్ను విడచిపెట్టి వెళ్ళవద్దు. కారణం ఇది నిశా సమయం.

అయోమయంగా ఉన్న ఈ దారి నిర్జనంగాను, అంధకార బంధురంగానూ ఉంది.

అలసిన ధరిత్రి – చేత ఊతకర్ర లేని కబోదివలె నిశ్చలంగా పడి ఉంది.

ఈ క్షణం కోసమే– దీపాన్ని వెలిగించి, పూలను కోసి పూజ చేద్దామని యుగాలనుంచి నిరీక్షిస్తూన్న వానివలె కనుపించే–

అపారమైన ఈ అనంత సాగరంలో మునిగి దానిలో కలసిపోవుటకుగాను నేను చెలియల కట్ట దగ్గరకు వచ్చేను.

## 38

ప్రభాతమవకముందే నీ మధురస్పర్శ నాకుతగిలినట్లు తెలుసుకోలేకపోయాను.

ఈ వార్త నిద్ర ద్వారా మెల్లగా నాకు చేరింది. ఆశ్చర్య చకితుడనై, అశ్రుపూర్ణనయనాలతో కళ్ళు తెరచేను.

వినీలాంబరం నాకై గుస గుసలతో నిండిపోయినట్లు అగపడింది. నా సర్వాంగాలు తీపి పాటలతో జలకమాడేయి.

మంచుతో బరువెక్కిన పూవు మాదిరి నా హృదయం నీ అర్చనలో వంగి ఉన్నది. నా జీవన వెల్లువ అనంతంలోకి ఉరకలు వేస్తూ పరుగులిడుతూన్నట్లు నేను అనుభూతి పొందుతున్నాను.

## 39

ఏ అతిథీ నా గృహానికి చాలాకాలం వరకు రాలేదు. నా తలుపులకు తాళాలు వేయబడ్డాయి. నా కిటికీలు మూయబడ్డాయి. ఈ రాత్రి ఒంటరిగానే నేను గడపాలేమో అని అనుకున్నా.

నేను కళ్ళు తెరచి చూసేసరికి, ఆ అంధకారం అంతా పటాపంచలయి పోయింది.

నేను ఒక్క ఉరుకున లేచి పరుగెత్తుకు వెళ్ళి చూసే సరికి నా గృహద్వారాల సీలలన్నీ ఊడి పడిపోయాయి.

తెరచిన తలుపులగుండా, నీ తాలూకు గాలి, వెలుగు తమ తమ జండాలను ఊపసాగేయి.

నా స్వగృహంలోనే నేను ఖైదీగా ఉండగా, తలుపులు మూయబడగా, అందులోంచి తప్పించుకొని పారిపోయి

స్వేచ్ఛగా సంచరిద్దామని నా హృదయం నిరంతరం ఉపాయాలు పన్నుతూండేది.

విరిగి పడిపోయిన నా గృహద్వారం వద్ద కూచుని ఇప్పటికీ నీ రాకకోసమై నిరీక్షిస్తూనే ఉన్నా.

నా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతోనే నన్ను నీవు బందీగా చేశావు.

# 40

ఓ నా హృదయమా ! దీపాలను ఆర్పివేయి. నీవు ఒంటరిగా గడపిన ఆ రాత్రి దీపాలను ఆర్పివేయి.

భానూదయం అయిందని ఉజ్జ్వల కాంతి వెల్లివిరిసిందని నీ మందిరం తలుపులు తెరవమని నీకు పిలుపు వచ్చింది.

ఓ నా హృదయమా! నీ సితారుని – ఒంటరిగా గడపిన నీ జీవితం యొక్క ఆ సితారుని ఒక మూల విడచిపెట్టు.

నీ గీతాలనే ప్రభాతం గానం చేస్తోందని నిశ్శబ్దంగా బయటకు రమ్మనమని నీకు పిలుపు వచ్చింది.

# 41

నీ కానుక అయిన ప్రభాత సురభిళ ప్రసూనము ఈ ఉదయాన నావద్దకు వచ్చింది. దానితో, నీ కాంతియొక్క మంజుల కూనరాగం కూడా వచ్చింది.

31

నీ ఉజ్జ్వల ప్రభాత అంతరంగంలో ఆనందపరవశంతో పరిభ్రమించే భ్రమరాన్ని నేను.

నా రెక్కలు పుష్పోడితో తళతళలాడుతున్నాయి.

నీ మధుమాసంలోని పాటల విందులో నేను పాల్గొన్నాను. పొగ మంచునుండి విడివడ్డ ఉదయం వలె నేను బంధాలనుంచి విముక్తుణ్ణి అయ్యేను. అప్పుడు అదంతా ఆటలో జరిగినట్టు జరిగిపోయింది.

# 42

అగోచర పథాల స్వేచ్ఛగా తిరుగాడే అడవిపక్షులకు ఎంతస్వేచ్ఛ కలదో అంత స్వేచ్ఛా నాకు ప్రసాదించు.

జల ప్రళయాన్ని కలిగించే వర్షాలకు, జుత్తు విరగ బోసుకొని అగమ్య గోచరంగా పరుగులు తీసే విశృంఖలమైన తుఫానుకు ఎంత స్వేచ్ఛ కలదో అంత స్వేచ్ఛా నాకు ప్రసాదించు.

అడవిలో కార్చిచ్చుకు ఎంత స్వేచ్ఛ కలదో అంత స్వేచ్ఛా నాకు ప్రసాదించు.

వికటాట్టహాసం చేస్తూ, చీకటిని చీల్చి చండాడే ఉరుముకు ఎంత స్వేచ్ఛ ఉన్నదో అంత స్వేచ్ఛా నాకు ప్రసాదించు.

## 43

నీవు నన్ను పిలచేసరికి నా గోడల నీడల క్రింద నిద్రిస్తున్నాను. నీపిలుపు నాకు వినబడలేదు.

అప్పుడు నీవు నీ మృదు హస్తాలతో తట్టి కన్నీటితో ఉన్న నన్ను నిద్రలేపేవు.

నేను లేచి చూసేసరికి సూర్యుడు బాగా మీదికి వచ్చేడు. అనంత గంభీర సముద్రంయొక్క పిలుపు వచ్చింది. నృత్యంచేస్తూన్న జలంమీద నా నావ ఊగుతూ ప్రయాణా నికి సంసిద్ధంగా ఉంది.

## 44

నిశా శృంఖలాలు తెగిపోయేయి. కలలన్నీ కరగి పోయాయి. మహదానందంగా ఉంది!

నీమాట తన తెరలను చీల్చుకొని బయటికి వచ్చింది. ఉదయపు మొగ్గలు విడివడ్డాయి. ఓ స్వాప్నికుడా. నిద్రలే!

కాంతియొక్క అభినందనలు ప్రాగ్దిశనుంచి పశ్చిమానికి వ్యాపించేయి.

శిథిల కారాగారంవద్ద జయజయ ధ్వానాలు మిన్నుముట్టేయి.

## 45

ఈ మహత్తర క్షణంలో ఉషాసుందరి పరచిన పూర్ణ కంబళిమీద ఆసీనుడవై ఉన్న నిన్ను నేను దర్శించేను.

సహస్ర కిరణుడైన భాస్కరుడు నీ కిరీటంలో రత్న మయి ప్రకాశిస్తున్నాడు. తారకలు నీ పవిత్ర చరణాలమీద రాలుతున్నాయి.

మానవాళి గుంపులు గుంపులుగా వచ్చి నీకు పాదాభి వందనం చేసి వెళ్ళిపోతున్నారు. కవి మూగవోయి ఓ మూల కూచున్నాడు.

## 46

ఈ శిశిర ప్రభాతాన నా అతిథి నా గుమ్మం దగ్గ రకు వచ్చేడు.

ఓ నా హృదయమా, పాడు! నీ స్వాగత గీతాల్ని ఆలాపించు!

నీ పాట సూర్యకాంతిలో వెలిగే నీలాంబరం పాట గానూ—హిమార్ద్రమైన ప్రభాత పవన గీతంగానూ—పసిడి పంటపొలాల బంగారు పాటగానూ—గల గల పారే నదీ సుందరి కిల కిలల పాటగానూ—రూపొందించాలి.

ఆవిధంగా చేయ శక్తి హీనుడవయితే, అతని పద నారవిందాన్ని నిర్నిమేషంగా చూస్తూ మూగవయి అతని ముందు నిలబడు కొంతసేపు.

ఆ తరువాత నీ ఇల్లువదలిపెట్టి మౌనంగా అతని వెంబడి వెళ్ళిపో.

# 47

నీడగా ఉన్న శాటప్రక్క నివసిస్తూ, సూర్యకాంతిలో ఉల్లాసంగా ఉన్న నా ప్రక్కింటివారి తోటలను చూస్తూండే వాణ్ణి.

అప్పుడు నేను పేదవాడి ననిపించింది. ఆకలితో గడప గడపకూ తిరిగేను.

వారు తమ అమిత సంపత్తునుంచి యెంత యెక్కువగా నాకు యిస్తున్నారో, నాకు నా భిక్షాపాత్ర అంత ఎక్కువగా జ్ఞప్తికి వస్తూంది.

ఒకనాటి ఉదయాన హఠాత్తుగా నా తలుపు తెరచే సరికి, నిద్రలోఉన్న నాకు తెలివి వచ్చేసింది. ఆ వచ్చినది నీవు. ధర్మం చేయమని అడిగేవు.

నిరాశతో నా పెట్టె మూత పగులగొట్టి తెరచేను. అందులో నా సంపద కనుగొనేసరికి ఆశ్చర్య చకితుడ నయ్యేను.

## 48

జీవితంయొక్క విందును దూరంగా బయటే బిచ్చగానిలా నిరంతరం నిరీక్షిస్తూ కూర్చుండే అతనిని నీ బాహు వల్లరిలోకి తీసుకొని మృత్యు కిరీటాలంకృతిని చేశావు.

అతని తప్పులను, లోపాలనుక్షమించి అతనికి అభయ హస్తం యిచ్చి, పరుగులు పెట్టే జీవితానికి ప్రశాంతత సమకూర్చేటటు ముద్దాడేవు.

అందరి చక్రవర్తులతోపాటే అతన్నికూడా ఒకణ్ణి చేశావు. అతన్ని ప్రాచీన విజ్ఞాన జగత్తులో అంతర్భాగంగా మలచేవు.

## 49

ధూళి దూసరితమైన ఈ లోకపు మట్టి బాటలపై నా హృదయాన్ని కోల్పోయాను. కాని దానిని నీవు నీ చేతితో పైకి తీసేవు.

ఆనందాన్వేషలో దుఃఖాన్నే ఏరుకున్నాను. నాకోసం నీవు పంపిన ఆ దుఃఖం, నా జీవితంలో సంతోషంగానే పరిణమించింది.

నా కోర్కెలు చిద్రుపలు చిద్రుపలై నేల పాల

య్యేయి. వాటన్నిటినీ నీవు ఏరి నీ అనురాగంలో మాలగా గుచ్చేవు.

నేను గడప గడపకూ తిరుగుతున్నా, నా ప్రతి అడుగూ, నీ మందిర ద్వారం కేసే తీసుకెళుతుంది.

## 50

బాటమీద పయనించుచున్నప్పుడు నేను ప్రజా సమూహంతో కలిసి ఉన్నాను.

బాట చివరకు చేరుకొనేసరికి నేను యేకాకిగా మాత్రం మిగిలేను.

పగలు గతించి సాంధ్య చీకట్లు ఎప్పుడు అలము కున్నాయో, నాతో వచ్చిన స్నేహితులు నన్నెప్పుడు విడచి వెళ్లారో—నాకు తెలియనే లేదు.

నీ మందిర ద్వారములు యెప్పుడు తెరవబడ్డాయో, నాకు తెలియలేదు.

నా హృదయం పాడుతూన్న మధుర గానానికి నేను ఆశ్చర్య చకితుడను అయ్యేను.

శయనించటానికి పాన్పు తయారయినప్పటికీ, దీపం వెలిగింప బడినప్పటికీ, మనమిద్దరమే ఉన్నప్పటికీ, నా నయనాల్లో కన్నీటి గుర్తులు ఇంకా వున్నాయా?

# 51

వారందరూ వచ్చి, గొడవచేసి నన్ను చుట్టుముట్టి నప్పుడు నీవు నా కంటికి అగపడకుండా చేశారు.

అందరు అయ్యేక చివరి వానిగా నీకు నా కానుక తీసుకువద్దామని అనుకున్నాను. ప్రొద్దు పోవటంతోనే, ఎవ రికి రావలసినది వారు తీసుకొని, నన్ను ఒంటరిగా వదలి వెళ్ళిపోయేరు.

అప్పుడు నీవు నా గుమ్మం దగ్గరనుంచుని ఉండగా చూసేను.

నీకు సమర్పించటానికి కానుకకోసం చూసేను. కాని నా దగ్గర ఇవ్వటానికి ఏమీ మిగలలేదు. నా చేతులు రెండూ మీదికెత్తి నీకు హృదయపూర్వకంగా నమస్కారం చేశాను.

# 52

నీవు నాకు చాలా యిచ్చేవు.
అయినప్పటికీ,ఇంకామరింత ఎక్కువ ఇమ్మనమనికోరేను.

నేను నీ సన్నిధికి వచ్చినది నిరంతరం పెల్లుబుకే పాతాళ గంగకోసంకాని ఒక్క దోసెడునీటికోసంకాదు నేను

నీ దగ్గరకు వచ్చింది. ప్రభువుండే దర్బారు చూపించమని కాని ఉత్తద్వారం మాత్రమే చూపించమని కాదు.

నేను నీదగ్గరకు వచ్చింది ప్రియునికోసమే కాని కేవలం ప్రేమ కానుక గురించే కాదు.

## 53

నా దినచర్య ప్రారంభించే ముందు, నీ పవిత్ర పదాబ్జాల్ని స్పృశించి వెళదామని వచ్చేను.

కొంతసేపు నీ కళ్ళను నా కళ్ళపై విశ్రాంతి తీసుకోనీ.

ఓ నా చెలికాడా! నా కార్యనిర్వహణలో నీ అండదండలు నాకు ఉంటాయన్న హామీ నాకు ఉండనీ.

ఈ రణగుణధ్వని ఎడారిలో నా మనస్సుని నీ గానంతో పూర్తిగా నింపివేయి.

నీ అనురాగపు సూర్యకాంతి నా ఆలోచనా శిఖరాలను చుంబించి, పక్వానికి వచ్చిన పంటలతో విలసిల్లుతూన్న నా జీవిత లోయల్లో తారాడనీ.

## 54

నీవు నా కళ్ళముందు నుంచుని, నీ చూపుతో నా పాటలను స్పృశించి, జ్వలింప చేయాలి.

నీవు నక్షత్రాలమధ్య నిలబడిఉండు. నా అర్చనాగ్ని వాటి దీపములలో ప్రజ్వలింప చేయాలి.

పృథ్వీమాత, లోకపు దారి ప్రక్కను ఉండి నిరీక్షిస్తోంది.

నీవు వచ్చే మార్గంలో ఆమె పరచిన పచ్చ తివాసీపై నుంచో. ఆమె తాలూకు పచ్చగడ్డి, మైదానపు పూలలో నీకు నేను సమర్పించిన వందనం సర్వత్రా వ్యాపించినట్టుగా నన్ను అనుభూతి పొందనీ.

నా హృదయం ఒంటరిగా నీకై కాచుకొని వుండే ఏకాంత సాయం సమయాల్లో నీవు దర్శనమియ్యి. ఆమె ఏకాంత మనెడి పాత్రను పూరించు. నీ అనంత ప్రేమను నన్ను అనుభూతి పొందనీ.

## 55

నీ ప్రేమను నా కంఠస్వరం మీాద ఆడుకోనీ – నా మౌనంపై విశ్రాంతి తీసుకోనీ.

నా హృదయం ద్వారా నీ ప్రేమవాహినిని నా సమస్త కదలిక లోనికి ప్రవహించనీ.

నీ ప్రేమను నా నిదురలోని అంధకారంలో నక్షత్రాలవలె ప్రకాశించనీ - నేను మేల్కొనగానే నీ ప్రేమ నాలో ఉదయించనీ.

నా కాంక్షల జ్వాలలో దానిని జ్వలించనీ. నా సమస్త ప్రేమ ప్రవాహాల్లో దానిని ప్రవహించనీ.

సంగీతాన్ని విపంచి తీసుకు పోవునట్లుగా, నీప్రేమను నా యావజ్జీవితం తీసుకు వెళ్ళనీ. అంతమందు నాజీవితంతో పాటు దానిని నీకు తిరిగి యిచ్చి వేస్తా.

# 56

ఓ నా చక్రవర్తీ, నీ దివ్య ప్రభలో నీవు దాక్కొని ఉన్నావు!

ఇసుక రేణువు, హిమ బిందువు ఎక్కువ అహంకారంతో అగపడుతున్నాయి.

నీ వస్తువుల నన్నింటినీ, తనకే అని లజ్జారహితంగా అంటుంది ఈ లోకం - అలా అన్నదని దానిని నీవుఎన్నడూ సిగ్గు పడేటట్లు చేయ లేదు.

మాకు వసతి ఇచ్చి నీవు మౌనంతో ప్రక్కన నుం

చుండి పోయావు. అందుచేతనే నిన్ను వెతకటానికై ప్రేమ తన దీపాన్ని వెలిగించింది. నిన్ను పూజించటానికై ఏ ఆజ్ఞలు లేకుండానే వచ్చింది.

# 57

విందు జరిగిన గృహం నుంచి నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి, 'నడిరేయి మాంత్రిక శక్తివల్ల నా రక్తం లోని పొంగు చల్లారింది.

దీపాలు లేని శూన్య ప్రదర్శన మందిరంలా నా హృదయం నిశ్శబ్దం అయిపోయింది.

అంధకారాన్ని దాటుకువెళ్ళి, నక్షత్రాల మధ్య నా మనస్సు నుంచుంది.

మన చక్రవర్తిగారి కోటలో నిశ్శబ్దంగా ఉన్న ప్రాంగణంలో మనం ఆడుకొంటూన్నట్లు చూసేను.

# 58

యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం లేక యథేచ్ఛగా సంతరించిన రోజుల్ని గురించి. గత రాత్రి నెమరువేసుకో సాగేను. అప్పుడు నీవు ఈ విధంగా అన్నట్లు భావించే_

"ప్రావనం యొక్క నిర్లక్ష్య జీవితంలో, నీ మందిరం తలుపుల నన్నింటినీ నీవు తెరచి ఉంచేవు.

లోకం ఇచ్ఛవచ్చినరీతి చిందరవందరగా దుమ్ము ధూళితో, కుశ్శంకలతో, అల్లరతో, గానా బజానాతో లోనికి వస్తూ పోతుండేది.

ఆ అల్లరి మూకతో అజ్ఞాతంగా, ఆజ్ఞారహితంగా నీ దగ్గరకు మాటిమాటికి నేను వచ్చాను.

నీవు నీ తలుపులు మూసి, ఉంచినట్లయితే, నేను నీ గృహానికి ఎట్లా రాగలిగి ఉండేవాణ్ణి?"

## 59

నీకు వసతి ఏర్పాటు చేయటంకోసం ఎవర్నీ ప్రక్కకు నెట్టివేయ నవసరం లేదు.

ప్రేమ నీకు ఆసనం తయారు చేసేటప్పుడు అందరకూ కూడా ఆమె తయారు చేస్తుంది.

ఇహలోకంలోని రాజులు దర్శనమిచ్చేటప్పుడు, రక్షక భటులు ప్రజా సమూహాన్ని దూరదూరంగా నెట్టివేస్తారు.

కాని నీవు వచ్చినప్పుడు మాత్రం-ఓ నా చక్రవర్తీ-సమస్త ప్రపంచం నీవెంబడే ఉంటుంది.

## 60

ప్రాభాతగీతాలు పాడుతూ, సూర్యోదయ అభినందనలు తీసుకువచ్చి, మా తలుపు అతడు తట్టుతాడు.

అతనితోనే మా పశువులను పొలాలలోనికి తీసుకొని వెళ్ళి మేపుతూ, తరుచ్ఛాయలలో పిల్లనగ్రోవి ఊదుకొంటాం.

సంతలో ప్రజా సమూహంలో అతను మాయమవుతూంటాడు. అతన్ని సంతలో మరల మరల కనుగొంటాం.

పగలు ఎక్కువ సందడిగా ఉండే సమయాన, దారిప్రక్క గల పచ్చికపై కూచుని ఉన్న అతని వద్దకు హఠాత్తుగా వచ్చి పడతాం.

అతను డోలు మ్రోగించగానే అతనివెంబడి వెళతాం.

అతను పాడినప్పుడు మేం నృత్యం చేస్తాం.

అతని ఆటలో మా సుఖ దుఃఖాలను పణంగా పెట్టి చివరకు ఆడుతాం,

మా పడవ చుక్కాని వద్ద అతడు నుంచుంటాడు.

అతనితో కలసి ప్రాణాపాయకరమైన తరంగ పంక్తులపై ఊగిసలాడుతాం.

దినాంతమందు, అతనికోసమై దీపాన్ని వెలిగించి నిరీక్షిస్తూంటాం.

# 61

కార్మికు లందరితో కలసి అతడు శ్రమించే ఆ ప్రదేశానికి అతని సహచరుల్లా పరుగిడండి.

అతను ఆటలాడుకునే చోట తోడి ఆటగాళ్ళలా అతని చుట్టూ కూచోండి.

అతను వాయించే ఢోలు ధ్వనికి అనుగుణ్యంగా అడుగులు వేసుకుంటూ అతను ఎక్కడకయితే వెళతాడో అచ్చటికి అతన్ని అనుసరించి వెళ్ళండి.

తోడితొక్కుడుగా ఉన్న జీవన్మరణ సంత మధ్యకు పరుగెత్తండి. కారణం, ఆ అల్లకల్లోలంమధ్య ఆ గుంపులో అతను ఉంటాడు.

ఏకాంతంగా ఉండే పర్వత పంక్తులపై ముళ్ళమీద పయనించేటప్పుడు తప్పటడుగులు వేయవద్దు. ఎందు చేతనంటే, ఆ ప్రయాణంలో అడుగడుగునకు అతని పిలుపు వినబడుతూంటుంది. ఆ పిలుపు ప్రేమ యొక్క పిలుపని మనకు తెలుసు.

## 62

ఉదయాన నీ ఆలయంలో గంటలు మ్రోగినప్పుడు, స్త్రీ పురుషులు నవ వికసిత కుసుమాలతోను తదితర పూజా ద్రవ్యాలతోనూ, తొందర తొందరగా అడవి మార్గాన వచ్చే సారు.

కాని నేను మాత్రం నీడనున్న పచ్చికలో పడుకొని, వాళ్ళను మాత్రం పోనిచ్చేను.

నేను సోమరిగా ఉండటమే మంచిదనిపించింది.

ఎందుచేతనంటే నా పూలు వికసించకుండా మొగ్గలు గానే ఉన్నాయి.

దివసాంతమందు, అవి ప్రఫుల్లాలయ్యేయి. అప్పుడు ఆ పూలను తీసుకుని సాయంకాలార్చనకు వెళ్ళేను.

# 63

నా ఇంటిముందు ఇప్పటికీ ఉన్న నా రాచబాట నా హృదయాన్ని కాంక్షాపూరితం చేస్తున్నది.

అది తన చేతిని నావైపుచూపి పిలుస్తోంది.

మౌనంగా నన్ను ఇంటిలోంచి బయటకు రమ్మన మంటూంది. మూగగా ప్రతిమాలుతూ అడుగడుగునకు నా పాదాలను ముద్దు పెట్టుకుంటోంది.

అది ఏ నిర్జన ప్రదేశాలలోకి, తీసుకు వెళుతుందో, ఏ ఆకస్మిక లాభప్రదేశాలకు తీసుకు వెళుతుంతో_ఏవిస్మయ విషాదాల్లోకి దారితీస్తుందో నాకు తెలియదు.

దాని మెలికలు ఎచ్చట సమాప్తమవుతాయో నాకు తెలియదు.

ఈ రాచబాట మాత్రము నా ఇంటిముందే ఇంకను ఉండి నా హృదయాన్ని మరులు గొల్పుతోంది.

## 64

దినసావసానమున, నా ప్రభువు మందిరానికి నడచి వెళుతూండగా, ప్రయాణీకులు వచ్చి ఈవిధంగా నన్ను ప్రశ్నించసాగేరు.

"రాజుగారికి కప్పం చెల్లించటానికి నీ దగ్గర ఏముందయ్యా?"

అప్పుడు వాళ్ళకు నేను ఏమి చూపించాలో, ఏమి జవాబియ్యాలో, తెలియలేదు. కారణం, నా దగ్గర అప్పుడున్నది ఒక్క పాట మాత్రమే.

దాన్ని గురించి ఇంటిలో చాలా తయారయ్యేను. అది నాదంటే నాదనే వాళ్ళు ఎక్కువమంది తయారయ్యేరు.

కాని, నేను మా ప్రభు మందిరానికి చేరుకునేసరికి, వారి మాలగుచ్చటానికి నా దగ్గర ఈ ఒక్కపాటే మిగిలింది.

## 65

నీ దగ్గరనుండి వచ్చేమధుమాసంలోని సురభిళ ప్రసూనాలు, నా పాటలు ఒకటే.

అయినప్పటికీ వాటిని నా స్వంతమే ననుకొని నీకు సమర్పించటానికి తెచ్చాను.

నీవు సురుచిర మందహాసం చేసి, వాటిని స్వీకరించేవు. నేను గర్వాతిశయంతో పొంగిపోతూండగా, నీవు ఆనందించేవు.

నా పాటల పూలు సున్నితమయినవి అయినా, అవి వాడి, మట్టిలో రాలిపోయినా, నేను ఎన్నడూ విచారించను.

సౌందర్యంలో ప్రఫుల్లమయ్యే నిలకడలేని క్షణాలు, నీ పూల మాలికలో నిత్య నూతనంగా ఉంచబడ్డాయి.

## 66

ఓ నా ప్రభూ! నన్నుపిలచి దారిప్రక్కన ఉండి పిల్లనగ్రోవి మ్రోగించమన్నావు. మూగజీవితాల బరువును మోసుకుతిరిగే కష్టజీవులు ఆ దారంట పోతూ ఆ గానాన్ని విని ఒక్కక్షణం ఆగి, నీ కోట సింహద్వారంముందు కూచుని ఆశ్చర్య చకితులవుతూంటారు.

పాతదిగా ఉండేదాన్నే కొంగ్రొత్తగా చూస్తూ, తమచుట్టూ ఎల్లప్పుడూ ఉండేవాటిని, వినూత్నమైనవిగా

కనుగొంటూ వారు ఈ విధంగా అంటారు. "ఇచ్చట పూలు బాగా వికసించేయి. పక్షులు మధురంగా పాడుతున్నాయి."

# 67

నా హృదయంలో ప్రప్రథమంగా పాటలు మేల్కొని నప్పుడు, వాటిని ప్రాభాత సురభిళ ప్రసూనాలతోడి ఆట గాళ్ళని అనుకున్నాను.

అవి రెక్కలు విదల్చి అగమ్యాగోచర ప్రదేశాలకు ఎగిరిపోగానే, తమ సమస్తాన్ని హెచ్చించటానికై హఠాత్తుగా ప్రళయ గర్జనలు చేస్తూ క్రిందికి దిగే వేసవి మేఘాల ఉత్సాహం వాటికి ఉన్నట్లు గోచరించింది.

అస్తమయసీమ కావల సీమలవరకు పరుగులు పెట్ట డానికై రమ్మనమని పిలచిన తుఫాను యొక్క పిచ్చి పిలుపు వాటికి వినబడి ఉంటుందని నేను అనుకున్నా.

కాని ఇప్పుడు ఈ సాంధ్య వెలుగులో తీరపు నీలి రేఖను చూచినప్పుడు, నాపాటలు. కల్లోల సాగరంగుండా సురక్షిత మైన రేవుకు నన్ను తీసుకువచ్చిన పడవ అని తెలుసు కున్నాను.

# 68

నీ సితారులో ఎన్నో తీగలు ఉన్నాయి. వాటిలో నావికూడా చేర్చనీ.

నీవు ఆ తీగలను ప్రయోగించగానే, నా హృదయం నిశ్శబ్దాన్ని పటాపంచలు చేస్తుంది. నా జీవితం నీ పాటతో కలసి ఏకమవుతుంది.

అసంఖ్యాకమైన నీ నక్షత్రముల నడుమ నా చిన్ని దీపమును ఉంచనీ.

నీ దీపావళి పండుగ నృత్యంలో, నా హృదయం నీమధురహాసంతో ఒకటవుతుంది.

# 69

ఉదయాన నిద్ర మేల్కాంచిన రీతి, పత్ర దళముల నుండి హిమ బిందువులు జారునట్లు, నా పాట నిర్మలంగా, నిరాడంబరంగా ఉండనీ.

నా పాట మబ్బులలోని రంగుల మాదిరి, నడిరేయి వానజల్లుల మాదిరి నిరాడంబరంగా, అతి సామాన్యంగా ఉండనీ.

51

నా సితారు తీగలు క్రొత్తగా బిగించబడ్డాయి. అవి క్రొత్తదనంచేత వాడియైన ఈటెలలా తమ స్వరాలను విర జిమ్ముతున్నాయి. ఆవిధంగా అవి వాయుశక్తిని పోగొట్టుకొని, ఆకాశకాంతిని బాధిస్తాయి. ఈ నా పాటలఅపస్వరాలు నీ సంగీతాన్ని వెనక్కు నెట్టివేయటానికి ప్రబల ప్రయత్నం చేస్తాయి.

# 70

జీవిత నర్తనశాలలో నీవు గానం చేస్తుండగా నేను నిన్ను చూసేను.

హఠాత్తుగా చివుళ్ళు తొడుగుతూన్న వసంతర్తులో, నీ మనోహర మందహాసం నన్ను అభినందించటానికి వచ్చింది.

మైదానములలోని పూలమధ్య పండుకొని, నీ గుసగుసలను పచ్చికలో ఆలకించేను.

పసిపాప నీ ఆశా సందేశాన్ని తీసుకు వచ్చింది. ఆ మాతృమూర్తి నీ ప్రేమ గానాన్ని నా గృహానికి తీసుకు వచ్చింది.

మృత్యువులో నిన్ను అనుభూతి: పొందాలనీ: నిశా నక్షత్రాల పాటల్లో జీవిత పల్లవిని తిరిగి కనుగొనాలనీ, నేను ఇప్పుడు ఈ సముద్రపుటొడ్డున నిరీక్షిస్తూ ఉన్నాను.

# 71

నా శైశవం జ్ఞాపకముందినాకు.

అప్పుడు సూర్యోదయం నాతోడి ఆటగానిలా నా శయ్యమీదకు విస్మయంతో ప్రతిరోజూ వచ్చిపడుతూండేది అప్పుడు అద్భుతశక్తి సంపన్నుడయిన భగవంతుని యందు నమ్మకము నా హృదయంలో అనుదినం నిర్మల ప్రసూనంలా వికసించేది.

అప్పుడు కీటకాలు, పశువులు, పక్షులు, కలుపు మొక్కలు, పచ్చిక, మబ్బులు నన్ను పూర్తిగా ఆశ్చర్య పరవశుణ్ణి చేసాయి. అప్పుడు, ఆ రాత్రి కురుస్తూన్న వర్షపు హోరు గంధర్వలోకంనుంచి మధుర స్మృతులను నాకు తీసుకు వచ్చింది.

సాంధ్యసమయాన మాతృ కంఠస్వరం తారలకు భాష్యంచెప్పేది.

అప్పుడు, మృత్యువుగురించి, తెరతొలగటం గురించి, నూతన అనుభవము గురించి, నేను ఆలోచిస్తూండే వాణ్ణి.

ఆసమయాన నాజీవితం ప్రేమయొక్క వినూత్న విస్మయంతో మేల్కొనేది.

# 72

ఓ లోకమా! నిన్ను నా హృదయం ప్రేమతో ముద్దాడనప్పుడు, నీ కాంతి శోభా విహీనమయి, నీ ఆకాశం దీపపు వెలుగులో సుదీర్ఘమైన ఆ నిశంతా నిరీక్షిస్తూనేఉంది.

నా హృదయం పాటలు పాడుతూ, నీ దెసకు వచ్చి, గుస గుసలాడి, నీ కంఠంలో పూలమాల వేసింది.

నా హృదయం నీకు ఏదో ఇచ్చిందనీ, దానికి నీవు నక్షత్ర సంపదతో భద్ర పరుస్తావనీ నాకు తెలుసు.

# 73

వేకువజామునుంచీ, కిటికీ దగ్గరున్న నీ ఆసనమునాకు ఇచ్చి వేసావు.

నీ ఆజ్ఞానువర్తులై నీ కార్యక్రమాలమీద పరుగులు పెడుతూన్న నీ మౌన సేవకులతో నేను సంభాషించి నీ సంగీత సమ్మేళనంలో నేను కూడా పాల్గొన్నాను.

గంభీర నిశ్శబ్దాన్ని భరిస్తూ, అతి ప్రశాంతంగా ఉన్న సాగరాన్ని నేను చూసేను. అదే సాగరాన్ని తన అగాధమైన లోతుల మాయాజాలాన్ని బట్టబయలు చేయడానికై తుఫానులో రౌద్రాకారంతో ఉండగాకూడా నేనుచూసేను.

యౌవన విందులో మహోల్లాసంతో ఉన్న పృథ్విని చూసేను. అదే పృథ్విని పొదుగుతూన్న నీడల ఘడియల్లో మందకొడిగా ఉండగా కూడా నేను చూసేను.

విత్తులు నాటడానికి వెళ్ళిన వారందరూ నా అభినందనలు విన్నారు. పండిన పంటను కోసుకుని ఇంటికి తెస్తూన్నవారు, ఉత్తగంపలతో ఇండ్లకు పోతూన్నవాళ్లూ, నా పాటలను నిర్లక్ష్యం చేస్తూ వెళ్ళిపోయారు.

ఆ విధంగా పగలంతా గడచిపోయింది. ఇప్పుడు ఈ సంధ్యాసమయంలో నీ లోకాన్ని ప్రేమించానని తెలియ చెప్పటానికై ఈ చరమ గీతాన్ని పాడుతున్నాను.

# 74

నిన్ను కీర్తించే పని నావంతుకు వచ్చింది.

నా పాటల్లో, నీ వసంతర్తు పరిమళపుష్పాలను గానం చేసాను. గలగలారావం చేస్తూన్న నీ పత్రాలకు లయ సమకూర్చేను.

నీ నిశీథి నిశ్శబ్దంలోనూ, ప్రభాత ప్రశాంతతలోనూ నేను పాడేను.

తొలి వేసవి వానల పులకరింతలు నా స్వరాల లోనికి, శిశిరసస్యాల లాస్యాలలోనికీ చొచ్చుకు పోయేయి.

నీవు నా హృదయాన్ని ఛేదించి, నా మందిరంలోకి వచ్చేటప్పుడు నాపాట ఆగిపోయేట్టు చేయకు. ఓ నా ప్రభూ! ఆ పాటను నీకు స్వాగత మిచ్చేదానిగా మాత్రం రూపొందించు.

# 75

నా జీవిత అతిథుల్లారా,

మీలోకొందరు తెల్లవారుఝామున-కొందరు రాత్రి భాగాన వచ్చేరు.

మీలో కొందరి పేర్లను వసంత కుసుమాలు చెప్పేయి-కొందరి పేర్లను వర్షాకాలపు వర్షపు జల్లులు చెప్పేయి.

మీలో కొందరు సితారుని తీసుకువచ్చారు–కొందరు దీపాన్ని తెచ్చారు.

మీరు వెళ్ళేక నా నట్టింట భగవానుని అడుగు జాడలు కనుపించేయి.

నా యాత్ర ముగుస్తూన్న ఈ సమయంలో, సాంధ్య పూజా ప్రసూనాల్లో మీ అందరికీ నా అభివందనలను ఉంచి శలవు తీసుకుంటున్నా.

## 76

నీ వదనారవిందం చూసినట్లు అనిపించగానే గాఢాంధకారంలో నా పడవను ప్రయాణానికి వదలేను.

ఇప్పుడు ముసి ముసి నగవులతో ఉదయం అయింది. వసంత కుసుమాలు ప్రఫుల్లాలయ్యేయి.

ఈ వెలుగు పోయినా, ఈ పూలు వాడిపోయినా నేను ప్రయాణం కొనసాగిస్తూనే ఉంటాను.

నీవు మూగ సంజ్ఞచేసి, నన్ను పిలచినప్పుడు, ఈ లోకం గాఢ నిద్రాపరవశ్యతంలో ఉన్నది. గాఢాంధకారం అంతటా నిండి ఉంది.

ఇప్పుడు గంటలు ఖంగు ఖంగుమని మ్రోగుతున్నాయి. పడవ బంగారంతో నింపబడింది.

గంటలు మ్రోగడం మానేసి మౌనం ధరించినా, నా పడవ శూన్యం అయిపోయినా సరే, నేను నా ప్రయాణాన్ని కొనసాగిస్తూనే ఉంటాను.

కొన్ని పడవలు అప్పుడే చాలాదూరం వెళ్ళిపోయాయి. మరికొన్ని సిద్ధంగా లేవు. నేను మాత్రం ఆలసించి వెనుక బడను.

తెరచాపలు గాలిని నింపుకున్నాయి. ఆవలి తీరం యొక్క సందేశం రాకపోయినప్పటికి, నేను నా ప్రయాణాన్ని కొనసాగిస్తూనే ఉంటాను.

## 77

"ఓ బాటసారీ! నీవు ఎక్కడికి వెళుతున్నావు?

"సముద్రంలో అరుణోదయాన స్నాన మాచరించటానికి ఇరువైపుల వృక్షములుగల బాటవెంబడి వెళుతున్నా"

"ఓ బాటసారీ, ఆ సముద్రం ఎచ్చట ఉన్నది ?"

"ఆ సముద్రం – ఈ నదీ ప్రవాహం ఎచ్చట ఆగిపో తుందో, ప్రభాతం ఉదయంగా ఎచ్చట వికసిస్తుందో, పగలు సాంధ్యచీకట్లలోకి ఎచ్చట జారుతుందో, అచ్చట ఉంది."

"ఓ బాటసారీ, నీతో వచ్చిన వాళ్ళు ఎందరు ?"

వాళ్ళను లెఖ్ఖించటం నాకు తెలియదు. వెలుగుతున్న దీపాలు పట్టుకొని రాత్రల్లా వారు పయనిస్తూనే ఉన్నారు. వారు పృధివీ, జలాలమీద పగలల్లా పాటలు పాడుతూనే ఉన్నారు.

"ఓ బాటసారీ! ఆ సముద్రం ఎంతదూరాన ఉంది?"

"అది ఎంతదూరం ఉందని మేం అందరం కూడా అడిగేం.

దాని కెరటాల ఘోష మిన్ను ముట్టేసరికి మేం అందరం మాటాడకుండా ఉండిపోయాం. అది ఎల్లప్పుడూ సమీపంగా ఉన్నట్లే అగపడుతున్నా, దూరంగానేఉన్నది."

"ఓ బాటసారీ! చాలా ప్రొద్దెక్కింది. సూర్యాతపం ఎక్కువగా ఉంది."

"నిజమే. మా ప్రయాణం సుదీర్ఘమైంది. దుఃఖ భూయిష్టమైంది. ఉత్సాహం తగ్గిన వారుంటే పాడండి. పిరికి గుండెలున్న వారుంటే పాడండి."

"ఓ బాటసారీ, రాత్రి ముంచుకొస్తే మాత్రం ఏం?"

"ప్రభాత గీతాలతో ఉదయం అయ్యేవరకు, మేం నిద్రపోతాం. సాగరం పిలుపు గాలి తరంగాలలో తేలియాడుతూ మా చెవుల సోకేవరకు మేం నిద్రిస్తూ ఉంటాం.

## 78

ఓ మార్గ సహవాసీ ! బాటసారి నయిన నా అభివందనలు ఇవిగో నీకు సమర్పిస్తున్నాను.

ఓ నా భగ్న హృదయేశ్వరా! ఇవే నా జీర్ణగృహ అభివందనలు.

ఓ పరంజ్యోతీ! ఓ నభోమణీ! నా నశించని ఆశ యొక్క అభివందనలు ఇవే.

ఓ నా మార్గదర్శీ!

అంతులేని బాటలో పయనించే బాటసారిని నేను. దేశ ద్రిమ్మరినయిన నా అభివందనలు ఇవే నీకు.

పంచాయతీ
వేమన గ్రంథాలయం,



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B130 |
| పుస్తకం పేరు | తరణి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 60, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |